గోలకొండ పత్రిక

స్వభాను సం॥ర ఆషాఢ బ॥ ౫-౬ గురువారము

# మున్నూరు ఘనులు

హైదరాబాదు రాష్ట్ర ఆర్థికమంత్రి యగు నవాబ్ గులాం మహమ్మదుఖాన్ గారు గతవారము వ్యాపారి మండలిసమితిలో ఉపన్యసించి నది ప్రకటించియున్నాము. అందు వారు రాష్ట్రములోని పరిశ్రమలను గురించి వాటి స్థితిగతులను గురించి తెలుపుచు, ప్రభుత్వమువారు పరిశ్రమలకు చంటిపిల్ల పోషణమును చేయుచున్నారని పల్కిరి. ఇది ప్రత్యేకము ముఖ్యసూత్రమని ప్రజలు గమనించవలెను. ఏరూపముగా కూడా పన్నులు చెల్లించకుండా ఉండే పరిశ్రమాలయాధికారులకు చంటిపిల్ల పోషణమేల? ఆపోషణ యెట్టిదనుకొన్నారు. ఒక మహారాణికి అపురూపముగా లేక లేక ఒక కుమార రత్నము జన్మించితే వాని కెట్టి పోషణ యగునో అట్టి పోషణ యని జనులు తెలుసుకొందురు గాక; రాణీగారి అపురూపపుబిడ్డకు ముక్కు నొచ్చితే ఇద్దరు డాక్టర్లు హాజరౌతారు. తుమ్మితే నర్సమ్మ (నర్స్) గారు తటపటాయించుతారు. శిశువు క్రిందనడువ గూడదు. ఎప్పుడున్నూ చేతులమీద లేక మెత్తలమీద ఉండవలెను. మన రాష్ట్ర పరిశ్రమలకు కరోడుగిరి మాఫ్! సర్కారీ అప్పులుకొల్ల! సర్కారీ భాగముమూడవ వంతు! ఆదాయంపన్ను, సున్నా! అధికలాభాలపన్ను, చాపుపన్ను, కార్పొరేషను పన్ను వారికి లేనేలేదు. సర్కారీ అవసరాలకు వారివద్దనే మొదలుకొందురు. ఈ విధముగా ఎన్నెన్నో సౌకర్యాలు కలిగించినారు. అయితే ఇన్ని అవస్థలు పడినా ఇవి బాగా యెదుగలేదు కదా అని గౌ॥ ఆర్థికమంత్రిగారు వాపోయినారు. చాలా నాజూకుగా పెంచిన పిల్లలకు ఎప్పుడూ రోగాలుండేది అందరికి తెలిసినా పిల్లల తల్లులైన రాణీకు మాత్రము తెలియదు. అదేవిధంగా ఉన్నది మన రాష్ట్ర పరిశ్రమ కిశోరము యొక్క అవస్థ. అనాదినుండి పన్నుల భారాన్ని భరించిన రైతుల కింత ఆదరణము కానరాదు. తుదకు కల్లు తప్ప త్రాగికోట్లు చెల్లించుకొనంటున్న కార్మిక వర్గాని పైనకూడా ఇంత అదరణము కానరాదు. తప్పు డాగిన తప్పుడుముఠాపైన ఆదరణమా అని అంటారేమో? త్రాగేవారుంటే త్రాగుతారనే మాట మరువకండి. వారిపైన ఏమి ఆదరణము చూపవలెను? పరిశ్రమలలోవలె ప్రభుత్వము ఫాయిదాలో భాగము వహించవలేనన్నట్లేమి. కల్లు సారా కచ్చేరీని వెంటనే పూర్తిగా మూసివేయుటయే నిండైన ఆదరణము. పై రైతుకార్మిక వర్గాలకు లేని ఆదరణము రాష్ట్రంలోని నూవకోటి సారా దుకాణాలపైన చూపినారుకదా. అట్టిఆదరణమున్నప్పటికిన్ని ప్రభుత్వము వారిప్పుడు అధికలాభాల పన్నును విధించుచున్నారయ్యా – అని అంటే పరిశ్రమ ధనికవర్గకిశోరము ఒకే రోదనము చేయుచున్నది. ఇల్లు పట్టకుండా అల్లరిచేస్తున్నది ఎందుకో అని రైతులోకం దిగ్భ్రమతో చూస్తున్నది. ఇదికూడా ఒక ప్రకృతితత్త్వము. ఎక్కువగా చనవుచేస్తే పిల్లలు నెత్తికెక్కి అల్లరి యెక్కువగా చేయుచుందురు. చనవు లేకపోతే కెవ్వుర్రు మనకుండా ఉంటాము. ఇది గమనించవలసిన రెండవసూత్రము.

బ్రిటిషిండియాలో ఆదాయము పన్ను రెండు తరాలనుండి వసూలగు చున్నది. అయిదేండ్లనుండివచ్చిన లాభాలపైపన్ను వసూలుచేసిరి. అక్కడివర్తకు లేమైన ఆర్భాటంచేసినారా? ఇంగ్లాండులో ౨౦ షిల్లింగుల లాభములో పందొమ్మిదిన్నర షిల్లింగులను ప్రభుత్వం వారు తీసుకొని అనుగ్రహించి మిగత అర్ధషిల్లింగును కష్టపడి సంపాదించిన వ్యాపారికివదలిపెట్టుచున్నారు. అంతే కాదు ఇంగ్లండులో అధికలాభాలెంత వస్తే అదంతా ఒకదమ్మిడీ విడువకుండా ప్రభుత్వమే లాగుకొని పోతున్నదని ఆర్థికమంత్రిగారే తెలిపినారు. అక్కడేమైనా గోలచేసినారా? ఎవడో ఒక కోటీశ్వరుడు గ్రహచారంవచ్చి రెండేండ్లనాడు ఇంగ్లండులో చచ్చెను. ౫కోట్ల ఆస్తి వదలిపెట్టిపోయెను. అందు౩కోట్లను ప్రభుత్వమువారు గ్రహించి మిగత ౨ కోట్లను వాని వారసుకిచ్చిరి. అట్టిదేమైనా ఈ హైదరాబాదులో చాపుపన్ను పేరుతో విరాసతు మంజూరీ పేరుతో జరిగితేయెట్లుంటుంది? బ్రిటిషిండియాలో ఎంత అ. లా. పన్ను తీసికొంటారో అంతకంటే చాలాతక్కువగానే తీసుకొంటాము అని హైదరాబాదు ప్రభుత్వమంటున్నది. నసేమిరా? అని అంటుంది వ్యాపారివర్గము, ధనికవర్గము.

హైదరాబాదులో ఆదినుండి ఒకే వర్గమువారే పన్నులభారమును వహించుచున్నారు అని సర్కారీ పత్రికా ప్రకటనలోనే కలదు. ఇది గమనింపదగిన మూడవ సూత్రము. మేమిదే మాటను ౧౫ ఏండ్లనుండి ఏకధాటిగా అంటూ ఆదాయంపన్నునువసూలు చేయండిఅని అంటూ వచ్చినాము. అధిక లాభాల పన్నును ప్రవేశపెట్టుతా మనేవరకు ఇదివరలో ఆదాయంపన్నును ఘోరముగా ప్రతిఘటించినకొందరు పెద్దలు ఇదేమి న్యాయమయ్యా మేము సంపాదించిన ౧౦౦ పాళ్ళలో ౬౦ పాళ్ళవరకు తీసుకొంటారట! కావలిస్తే ఆదాయంపన్నే పెట్టండి అని అంటున్నారని గౌ॥ ఆర్థిక మంత్రిగారే సెలవిచ్చినారు. ఇదేమి చిత్రము. ఒక సంవత్సరములోనే వారి భావాలు అంత ఔదార్యవంతముగా మారిపోవుటయేల? ఇదికూడా ప్రకృతి తత్త్వనియమమే. చాపుకుపెట్టితే లంఖణానికి దిగుతుంది అని అంటారు తెనుగువారు. అధికలాభాల పన్నునుండి జాగీర్దారులు తప్పించుకొంటున్నారు. అధికారులు తప్పించుకొంటున్నారు. అందుచేత నలుగురితోపాటు జాతరకు పోయినట్లుంటుందని పై మహాశయులు ఇప్పుడు ఆదాయంపన్నుకు అనుకూలురుగా మారినట్లున్నది. అందరున్నూ ఎవరిశక్తికొలదివారు పన్నులను భరింపవలెను అనునది సరియగున దైన చో ఇప్పటికైనా అ.లా. పన్నుకుమారుగా ఆదాయంపన్ను ప్రవేశపెట్టవచ్చును.

వర్తకులు, కోటీశ్వరులు, ఇప్పుడు అత్యంతౌదార్యముగా రాజకీయ నాయకులుగా కూడిపోవుచున్నారు. ఇది గమనించదగిన నాల్గవసూత్రము. "ప్రాతినిధ్యములేనిది పన్నులు వేయరాదు" అను సుప్రసిద్ధ ఆంగ్లరాజకీయ నీతిసూత్రమును ఒక కోటీశ్వరుడు దివ్యముగా బోధించుటకు మొదలుపెట్టినాడు. బాధ్యతాయుత ప్రభుత్వము కావలెనండీఅని

మన రాజకీయనాయకులు ఆందోళన చేసిననాడు వీరెక్కడుండిరో యేమో పాపము. కొత్తపన్నులువిధించుటకుగాను ప్రజాప్రతినిధుల శాసనసభ ఉండవలెనని కొందరు ధనికులంటున్నారు. మరి పాతపన్నులను ఎవ్వరువిధించియుండిరి. ఆపన్నుల తగ్గింపునకై ఎన్నడైన పల్లెత్తుమాట పలికియుండిరా? ప్రపంచము ఎంతటి స్వార్థముతో కూడినదో గమనింపుడు.

హైదరాబాదు రాష్ట్రములోని మున్నూరు కోటీశ్వరుల యోగక్షేమ సౌకర్య సౌభాగ్యాలకంటే ౧౬౦లక్షల సంఖ్యాకులైన మా. ఘ. వ. నిజాంప్రభువుగారి ప్రియమగు ప్రజల నిజమగు అభివృద్ధియే ప్రభుత్వానికి ఎక్కువ అవసరము అని గౌ॥ ఆర్థికమంత్రిగారన్నారు. ఇదిగమనింపదగిన అయిదవ సూత్రము. హైదరాబాదులో అనాదినుండియు జాగీర్దారులే ప్రభుత్వమంత్రులయి ప్రభుత్వాన్ని నడిపించినారు. కోటీశ్వరుల బాకీదారులుగా జాగీర్దారులు ఉంటూవచ్చినారు. పేరయ్యల జుట్టుకు సారాసెంబు తాడుకట్టి తల ఊపించినది ఈకోటీశ్వరులే అన్నమాట. కావున గౌ॥ ఆర్థికమంత్రిగారు మాటలలో ఆశ్చర్యంలేదు. మున్నూరు అన్న మాట ముచ్చటగానున్నది. నేడు ఇంగ్లాండు దేశము ప్రజాసత్తాక పరిపాలనకు దివ్యజ్యోతిఅని ప్రపంచము భావించుచున్నదో ఆయింగ్లాండు ప్రభుత్వమును ఇంచుమించు ౫౦ ఏండ్లనుండి ౩౦౦మంది కోటీశ్వరులు స్వాధీనపరుచుకొని సాగించుచున్నారు. కావున ప్రపంచములో ప్రజారాజ్యమనునదిశశపుష్పమువంటిది. దానికే జనులు భ్రమసిపోయినారు. నిజరూపమందరికిన్నీ కనబడదు. పరిశోధకులకే కనబడును కానివారిమాటలను నమ్మేవారు కానరారు. ముందు మన రాజ్యాంగ సంస్కరణముల లోని శాసనసభలలోకూడా ప్రజాప్రతినిధులకు తక్కువస్థాన మున్నది. ధనికవర్గాలకే ఎక్కువస్థానాలున్నవి. కావున ఈనాడు హైదరాబాదు రాజ్యాన్ని ఆడించుచున్న 'మున్నూరు"వారు ముందుకూడా దైవానుగ్రహము వలన ప్రభుత్వమువారి కోరికవలన పాతఆటనే క్రొత్తరాగముతో క్రొత్తవిలాయితీ రంగులతో పోడక్షతోకూడిన క్రొత్తపాలతో ఆడుచుండగలరు. మనమంతా ఆమాట నమ్మాడిన తర్వాత బాగున్నదాఅని అడిగితే పార్సీచిలుకవలె "అందుకు సందేహమేమి?" (వరీ వషక్) అని అంటాము!

## బట్టలధరలు తగ్గుచున్నవి

ఆగస్టునెలలోపల పాతసరకులన్ని అమ్మవలెనను బ్రిటిషిండియాలో ఆజ్ఞ అయినదని అనుటచేతనున్నూ హైదరాబాదులో అధికలాభాలపన్నును విధింతురని తెలిసిపోయినందుననున్నూ వేరుసెనగపత్తి మున్నగువాటిధరలు క్రమముగా పడిపోయినందునను ఇంతవరకు బిరుగాబట్టి ధరలు తగ్గించకుండా ఉంచిన హైదరాబాదు సికింద్రాబాదు వర్తకులు తబ్బిబ్బైనారు. ఇప్పుడురూపాయికి ౭ అణాలప్రకారం ధరపడిపోయినదని తెలియవచ్చుచున్నది. ధరలింకపడిపోగలవని అంచెనా వేయబడుచున్నది.

## ధాన్యంసప్లయి సంఘము

రాజబహద్దరు వేంకటరామారెడ్డిగారి అధ్యక్షత లో అధికారేతరసంఘమేర్పడియున్నది. అధ్యక్షులు సోమవారం సాయంకాలము పత్రికాధిపతులకు మరికొందరిపెద్దలకు తేటవిందునిచ్చిరి. ఆసందర్భములో పత్రికలవారు తమపత్రికలలోను సంఘము వారికి స్థానమిచ్చి సాయపడుదుమనిరి. కొందరు భుక్తికికావలసిన ధాన్యము వృద్ధిచేయుటకు సూచనలు చేసిరి.

## ౫౦ మందికంటే ఎక్కువ తినగూడదు!

హైదరాబాదు ప్రభుత్వం ఇట్లాజ్ఞాపించు చున్నది:—

౨౦గష్టుతేదీనుండి ఎవరున్నూ విందులలోకూడా ౫౦మందికంటేయెక్కువమందిని పిలుచుకొని భుజింపజేయగూడదు.

## హైదరాబాదు ఖాదీప్రచారసంఘమువారి ప్రకటన

డిసెంబరు ౧౯౪౧ సంవత్సరమునకు పూర్వమునుండియు నిరంతరము ఖాదీబట్టను వాడుకొను వారికి తెలియపరచునదేమనగా అఖిలభారత చరఖాసంఘపుశాఖలగు హైదరాబాదు సికింద్రాబాదు భండారులలో ౨౦-౭ రవతేదీలోపుగా సాయంత్రము గ. ౬ లనుండి ౭-౩౦లమధ్య తమపేర్లను రిజిష్టరుచేయించుకోవలసినదిగా కోరుచున్నాము,

ఓక్కిపెడుకానట్టి ఖాదీనివాడుకొనువారున్న, మిల్లునూలును ఖాదీనూలుకలిపినబట్టలను వాడుకొనువారున్నూ తమపేర్లను పైభండారులలో రిజిష్టరుచేయించుకొనవద్దని తెలుపుచున్నాము.

ఖాదీనేర్పుతరగతులు

పైనకనుబడిన కాలవ్యవధిలో ౯౬ స్త్రీలకునూ౩౦పురుషులకును నూలువడుకుటలో తర్ఫీదు ఈయబడినది. వీరందరు ఇప్పుడుతమఇండ్లలోవడకుచున్నారు.

శ్రీమతి నీలావణిదేవిగారును, శ్రీయుత రామేశ్వరసింగుగారును మహారాష్ట్ర చరఖాసంఘ కేంద్రమగు మెట్టుపల్లి తర్ఫియతుకొసగిరి. వీరిప్పుడు స్త్రీపురుషులకయిచట తరగతులను నడుపుచున్నారు. ప్రత్తి నిప్పుభ్రమా చేయుట, విత్తులను ఒడదీయుట, ఏకులనుచేయుట, దారమువడకుట, ధారమునుచుట్టుట మొదలగుపనులు నేర్పబడును.

ఇందుకెట్టిఫీసు నివ్వనక్కరలేదు. సంఘమువారే పనినేర్పుకాలములో పనిముట్లను సప్లయిచేయుదురు.

ప్రస్తుతము యీ సెలలో స్త్రీలకు ౭ తరగతులు: ౨ దూల్‌పేటలోను, ౧ మహిళాజీవనమండలిలోను ౧ షలకునుకు లోను, ౧ నల్లకుంటలోను, ౧ శక్తిశాలికలపాఠశాలలోను ౧ చరఖా సంఘములోను నడపబడుచున్నవి. పురుషులకు ౩ తరగతులు:— ౨ దూల్‌పేటలోను ౧ చరఖాసంఘములోను నడపబడుచున్నవి. సంఘములోని తరగతులు స్త్రీలకు ౧౧గం, ౩ గం.ల వరకును. పురుషులకు గం. ౭-౬ల వరకును నడపబడును.

విజ్ఞాపన

ప్రజలిట్టితరగతులగూర్చి చాల ఆతురత పడుచున్నారు. పట్టణములో వివిధస్థలములందు క్రొత్త తరగతుల నడుపవలసినదనికోరుచు దరఖాస్తులు వచ్చుచున్నవి. అట్టితరగతులకు అధమము పదిమందినైన నేర్చుకొనువారుండవలెను.

కాబట్టిదరఖాస్తునారులు తరగతులను నడుపు విషయమై కోరుటకుముందుగా అనగా అధమము పదిమందినేర్చుకొనుటకు ఒకచోటచేరెదమని స్థలమును, పేర్లనుతెలుపుచు యీ నెల౩౧తేదీ లోపుగా హైదరాబాదు రఖాసంఘ కార్యదర్శి గారికి తెలియపరచవలసినదిగా తెలుపనైనది.

గౌరవ కార్యదర్శి,
ఖాదీప్రచారసంఘము, సుల్తాన్‌బజారు
దక్షిణ-హైదరాబాదు.

... ...

ఖాదీప్రచారసంఘము
(సికిందరాబాదు-దక్కన్)

జూలై ౧౬వతేదీనుండి క్రింద తెలుపబడిన స్థలములలో వివరింపబడినకాలములలో రాట్నముపై నూలువడకుట ఉచితముగా నేర్పబడుచున్నది. ఈ విషయములో అభిరుచిగలవారు ప్రత్తినిబాగుచేయుట, ఏకులచేయుట, నూలువడకుట మున్నగు వివిధకార్యముల తమకనుకూలమైనకేంద్రములలో నేర్చుకొనవచ్చును. ఇంకను వివరములు కోరువారు షుద్రిక్ స్ట్రీటులో ఉన్న సంఘముయొక్క ఆఫీసులోగాని, కింగ్సువేలోనున్న మహారాష్ట్ర చరఖాసంఘముయొక్క ఖాదీ భాండారములోగాని విచారింపవచ్చును.

వివిధ కేంద్రములు

౧. శ్రీగిరి పద్మయ్యగారిఇల్లు పద్మయ్యవీధి, రెజిమెంటల్ బజారు. స్త్రీలకొరకే మధ్యాహ్నం ౧.౨నుండి ౧-౩౦ వరకు.

౨. ఖాదీభండారము కింగ్సువే. పురుషులకొరకే ౨గంటలనుండి ౩-౩౦ వరకు.

౩. జీరాలోని ఆర్. నానావతి, డ్యాస్‌గారి ఇంట్లో స్త్రీలకొరకే సాయంకాలము ౪గం-నుండి ౫-౩౦ వరకు షుద్రిక్ స్ట్రీటులోనున్న సంఘముయొక్క ఆఫీసులో పురుషులకొరకే సాయంకాలము ౬గంటలనుండి ౭వరకు.

వైద్యనాథన్,
గౌరవ కార్యదర్శి,
౧౭-౭-౧౯౪౩ సికిందరాబాదు ఖాదీప్రచారసంఘము.

## హైదరాబాదు రేడియో తెలుగు కార్యక్రమము

శనివారం ౨౪ జూలైతేదీన ౫ గంటల నుండి ౫-౩౦ గంటలవరకు జరిగే తెలుగుకార్యక్రమమ వరుసగా యుద్ధవార్తలు, రికార్డు సంగీతం, "వాయువాడిరత్నశ్రీపాయాలు" అనుశీర్షికగల ప్రసంగము, రికార్డుసంగీతం, 'సాహిత్యంలో రసము' అన ఉపన్యాసం శ్రీ కురుగంటి సీతారామయ్యగారిది.

## అధిక లాభాల పన్ను

హైదరాబాదునగరం జమ్రూదు మహలులో శనివారమునాడు అ.లా. పన్నును ప్రభుత్వమువారు విధింపవలెనని తెలుపుటకై పౌరులపక్షాన మహాసభజరిగెను. హాలంతా నిండి క్రిక్కిరిసిపోయెను. బయటకూడా జనులు నిలువవలసివచ్చెను. రాజబహద్దరుగౌడుగారు సభకు శ్రీమతి పద్మజా నాయుడుగారిని అధ్యక్షులుగానుండుటకై ప్రతిపాదించిరి. అధ్యక్షురాలు పైపన్ను ఆవశ్యకతనుగూర్చి చాలా ఘాటుగా నుపన్యసించిరి. బీద జనులుమాత్రమే అనాదినుండియు పన్నులభారంవహించుచున్నారు. ధనికవ్యాపారివర్గమువారు ఇంతవరకేమి పన్నులిచ్చుకొన్నారు. ఇప్పుడు తమమీదికివచ్చినదని తర్కాలు చేయుచున్నారు. బీదలు చెప్పరాని కష్టాలక్రింద, ఘోరాలక్రింద ఆకలి నుసిద్రిమిలో పుచున్నారు. ప్రజలందరున్నూ ఈపన్నును అపారలాభాలుపొందినవారిపై విధించండి అని ఏకవాక్యముగా కోరుచున్నారు. ఇప్పుడే వ్యాపారులుండి తర్కాలు చేయుచున్నారుకదా. ఇదేనావాటికిసమయం. ప్రాణాలు ఒకదిక్కుపోతుంటే ఒకదిక్కు మందులప్రయోగపరీక్ష చేస్తున్నట్లున్నది. ధనికవర్గము వారు ఒలికారు. వారెన్ని యుపాయాలు పన్ని తమపలుకుబడిని ఖాగాయిచాని గించి ఈశాసనమును రద్దుచేయించవచ్చును. ప్రభుత్వమువారు అట్టివానికిలొంగక దీనిశాసనంచేయవలెను. ప్రాతినిధ్యంలేకుంటే పన్నులు లేవుఅను శాస్త్రము ఇప్పుడు వ్యాపారులకు జ్ఞాపకంవచ్చింది. శాస్త్రము బాగుందికాని పన్నును ఎగరగొట్టించెదానికి దీనిని సేవలోనికితీసుకొనరాదు. ఈవిధంగా మిసెస్ పద్మజా గారుపన్యసించిరి. తర్వాత నవాబు అహ్మదల్లీఖాను గారు తీర్మానానికనుకూలముగా మాట్లాడినపిమ్మట గౌడుగారు అధికలాభాలపన్ను శాసనము వెంటనే వేయవలెనని తీర్మానంప్రతిపాదించెను. మందుముల రామచంద్రరావుగారు దానిని బలపరచుచు నుపన్యసించిరి. మీర్ అక్బరలీఖాన్ బ్యారిస్టరుగారు జోన్. రాఘవేంద్రరావుగారున్నూ మాట్లాడిరి. తీర్మానం ఏకగ్రీవముగా అంగీకరింపబడెను.

## కరీంనగరం జిల్లా:—

ఈమధ్య జనాబ్ గులాం ముస్తఫా సాహెబ్ గారు తాలూకా అవ్వల్ తాలూకాదారుగా మా జిల్లాలో పనిచేసియుండిరి. శ్రీవారి అధికారకాలములో దావాల తీర్పులు చాలాన్యాయముగాను, త్వరగాను జరిపి ప్రజాసామాన్యముచేత ప్రశంసనీయముగా తోచ్చిరి, వీరి శాంతచిత్తయు న్యాయశీలతయు చూచినచో శ్రీ॥ శ్రీ॥ గోవిందనాయక్ గారి జమానా జ్ఞప్తికివచ్చుచుండెడిది.

వీరి తరువాత జనాబు ఏబాలురషీదుద్దీన్ ఖాన్ సాహెబుగారు తాలూకాదారుగా యున్నారు. శ్రీనవాబుగారు సర్వజన ప్రీతిపాత్రులును, ప్రజాక్షేమమునకు పాటుపడువారును, న్యాయశీలురును అయియున్నారు. ప్రజలకష్టనివారణకు వారిన్యాయసాధనము ఎల్లప్పుడు తెరచియేయుండును. తగాదాల పరిష్కారమును మిక్కిలి శ్రద్ధతోను, శీఘ్రముగాను చేయుదురు. వాది ప్రతివాదుల దీర్ఘకాలము తీర్పులకొరకై నిరీక్షిస్తూ యుండవలసిన పనిలేదు. ఇరుపక్షములవారి వాదనలు వినుటతోడనే న్యాయము ప్రసాదింపబడును.

బీదల సంరక్షణకార్యములలో గూడ శ్రీవారికి ప్రత్యేకశ్రద్ధ యున్నది. అర్హులైనవారికి తిండిభాగ్యము ఉచితముగా పంచబడుచున్నది. ఈ పద్ధతి జిల్లా ముఖ్యస్థానమందేగాక గ్రామాదులయందు గూడా అమలుతో యున్నది. హుజూరాబాదు తాలూకావాసులమగు మేము శ్రీవారి సేవ్పరీతనమును చాలాకాలమునుండి ఎరుగుదుము. మాదిది జనల్ ఆఫీసరుగా యుండిన వీరు మా జిల్లాకే తాలూకాదారుగా వచ్చుట మాకు గర్వకారణము. భగవంతుడు శ్రీవారికి దీర్ఘాయువు సుఖమును శాశ్వతముగా ప్రసాదించుగాక.

యిట్లు
హుజూరాబాదు తాలూకా
వాసులు.

చందా వివరాలు
సంవత్సరము చందా 6 పావలి రూపాయలు
ఆరు నెలలకు „ 3-10-0
బ్రిటిషిండియాలో సంవత్సరం చందా తెల్లారు
విడి ప్రతిక 0-1-6
పాత పత్రిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominions
BEST MEDIUM — FOR — ADVERTISFMENT

Volu 18 — No. 21] Fublished on every Monday and Thursday Hyderabad Dn [ 22 7—1943






కేవలము రూపాయిలేకాక చిల్లరకూడా జనులు కూర్చియుంచుకొనకూడదు. అట్లుచేసిన శిక్షింపబడుదురని హైదరాబాదు ప్రభుత్వము శాసించుచున్నది.

... ...

1 ఆజూరు 1352 నుండి హైదరాబాదులో ఇండ్లకు మునిసిపల్ పన్ను నూటికి 6 కు మారుగా 7-8-0 తీసుకొనబడును.

... ...
















Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad-Dn. Editor S. Pratap Reddy, B.L., B.